# జ [illegible] ముచ్చలు






కర్త:

రాయప్రోలు సుబ్బారావు


వెల ౧-౦-౦

# విజ్ఞప్తి

ఇందలి పద్యములు పలుపత్రికలనుండి యేరికొంటిని. ఆంధ్రభారతి, గ్రంథాలయసర్వస్వములు అందు ముఖ్యములు. ఏతత్పత్రికాధిపతుల ఇయ్యకోలున కెంతయుఁ గృతజ్ఞుఁడను. చేర్పఁదలచిన మఱికొన్నిపద్యములు విస్మృతి గహనముపాలై దొరకినవికావు. రసికులకిం దేవియేని రుచించినఁ గృతకృత్యుఁడను.

—గ్రంథకర్త.

కం. పాయలు పాయలుగా విడి
పోయిన నా తెనుఁగుకన్నె ముంగురులను వే
ణీ యోగ్యాభరణముగా
నీ యెడ జడకుచ్చు లల్లి యిచ్చితిఁ బ్రీతిన్.





# జన్మభూమి

ఏ దేశమేగినా ♦ ఎందుకాలిడిన
ఏ పీఠమెక్కినా ♦ ఎవ్వరేమనిన
పొగడరా నీతల్లి ♦ భూమి భారతిని
నిలుపరా నీజాతి ♦ నిండుగర్వమ్ము
లేదురా యిటువంటి ♦ భూదేవి యెందు
లేదురా మనవంటి ♦ పౌరు లింకెందు.

ఏ పూర్వపుణ్యమో ♦ ఏ యోగబలమొ!
జనియించినాడ వీ ♦ స్వర్గలోకమున
ఏ మంచిపూవులన్ ♦ ప్రేమించినావొ!
నిను మోచె నీతల్లి ♦ కనకగర్భమున.

సూర్యుని వెలుతురుల్ ♦ సోకునందాక
ఓడల జెండాలు ♦ ఆడునందాక
నరుడు ప్రాణాలతో ♦ నడుచునందాక
అందాకగల యీ యనంత ♦ భూతలిని
మనభూమివంటి క ♦ మ్మని భూమిలేదు.

తమతపస్సులు ఋషుల్ ♦ ధారవోయంగ
చండవీర్యము శూర ♦ చంద్రు లర్పింప

రాగదుగ్ధము భక్తి ♦ రాజు లేయుంగ
భావసూత్రము కవి ♦ బాంధవు లల్ల

దిక్కుల కెగఁదన్ని ♦ తేజంబు వెలుఁగ
జగముల నూగించు ♦ మగతనం బెగయ
రాలు పూవులుసేయు ♦ రాగాలు సాగ
సౌందర్య మెగఁబోయు ♦ సాహిత్య మొప్ప

వెలిగిన దీదివ్య ♦ విశ్వంబు పుట్టి!
దీపించె నీపుణ్య ♦ దేశంబు పుట్టి!

అవమాన మేలరా! ♦ అనుమాన మేల!
భరతపుత్రుఁడ నంచు ♦ భక్తితోఁ బలుక!



# తమ్ముడా!




లుపొంగిన ♦ జీవగడ్డయి
పాలు బాఱిన ♦ భాగ్యసీమయి
వ్రాలినది యీ ♦ భరతవర్షము
భక్తిఁ బాడర తమ్ముడా!

౨ వేదశాఖలు ♦ వెలసె నిచ్చట
ఆదికావ్యం ♦ బలరె నిచ్చట
బాదరాయణ ♦ పరమఋషులకు
పాదు సుమ్మిది తమ్ముడా!

౩ విపిన బంధుర ♦ వృక్షవాటిక
ఉపనిషన్మధు ♦ వొలికె నిచ్చట
విపులతత్త్వము ♦ విస్తరించిన
విశ్వవాణి యిదె తమ్ముడా!

౪ సూత్రయుగముల ♦ శుద్ధవాసన
క్షాత్రయుగముల ♦ చండశౌర్యము
చిత్రదాస్యము ♦ చే చరిత్రల
చెఱిగిపోయెర తమ్ముడా!

౫ మేలికిన్నెర ♦ మేళవించి
రాలు గరుగగ ♦ రాగమెత్తి
పాల తీయని ♦ బాల భారత
పదము బాడర తమ్ముడా!

౬ నవరసమ్ములు ♦ నాట్యమాడగ
చిగురుపలుకులు ♦ చెవుల విందుగ
కవితలల్లిన ♦ కాంత హృదయుల
గౌరవింపర తమ్ముడా!

౭ దేశగర్వము ♦ దీప్తి చెందగ
దేశచరిత్రము ♦ తేజరిల్లగ
దేశ మరసిన ♦ ధీరపురుషుల
తెలిసి పాడర తమ్ముడా!

౮ పాండవేయుల ♦ పదునుకత్తులు
నుండి మెఱసిన ♦ సుమహిత రణకథ
కండగల చి ♦ క్కని తెనుంగుల.
కలిపి పాడర తమ్ముడా!

౯ లోక మంతకు ♦ కాక బెట్టిన
కాకతీయుల ♦ కదన పాండితి
చీకిపోవని ♦ చేవమాటల
చేర్చి పాడర తమ్ముడా!

౧౦ తుంగభద్రా ♦ భంగములతో
పొంగి నింగిని ♦ పొడచి తుళ్ళి
భంగపడని తె ♦ నుంగు నాథుల
పాటబాడర తమ్ముడా!

తమ్ముడా!

౧౧ పసుపుకొంగుల • మాసుంగు లెడలగ
కొసలు తీర్చిన • కోరకత్తుల
కసరిపోరిన • గండు యోధుల
పదము బాడగ తమ్ముడా!



# ఆంధ్రమాత

శా. శ్రీలింపొందగ యావదాంధ్రజనమా ♦ త్మస్మృతిన్ నూత్నతే
జోలీలామృతమూని, దద్బలవశా ♦ త్సుకృత్యంబునన్ తావకో
ద్వేలప్రాక్తన కీర్తిగీతముల న ♦ ర్థింబాడు నీపుత్రి పు
త్రీలోకమ్మున కేమి చెప్పెదవు సం ♦ దేశంబు నాంధ్రావనీ!

శా. ఆశల్ కౌతుకపూర్ణచంద్రికలు ప్రా ♦ యన్ మస్తనాచ్ఛాదమా
కాశమ్మున్ విడిపోవ, నూతనకళో ♦ త్కర్షాప్తమై మాతృపూ
జాశోభల్ దయివారు నీశుభదినో ♦ త్సాహంబు నీక్షించి, నీ
యాశీర్వాదములిమ్ము పుత్త్రులకుం ♦ బా! యాంధ్రదేవీమణీ!

శా. తేటల్ దేరెడు కాంతిపూరముల నా ♦ ద్దీపించు ముత్యాల పు
ప్పేటల్ వోలె త్వదీయకంఠమున శో ♦ భింపుల్ నిగారించు, చే
నాటన్ జీవనశోషణాల్ గనని కృ ♦ ష్ణాగౌతమీ భద్రలన్
గాటంపుందమిఁ ద్రావువారమి వె కాం ♦ క్షాక్షీరమాంధ్రావనీ!

శా. ఆ చాళుక్యనృపాలరత్నముల వి ♦ ద్యామ్మోది, శ్రీకాకతి
క్ష్మాచక్రేశుల లాలనల్ వడసి, కృ ♦ ష్ణప్రాజ్యసామ్రాజ్య పీ
ఠీచంచజ్జయకన్యతో సరసగో ♦ ష్ఠిన్ ప్రొద్దుపోఁబుచ్చు, నీ
ప్రాచీనాభ్యుదయమ్మునెన్నదరు గ ♦ ర్వస్ఫూర్తి తల్లీ! సుతుల్

శా. ఉద్యన్నోత్సాహసమై, కుమారజన గ ♦ ర్వోద్రేకమై, యాత్రిలిం
గోద్యానాప్తమధూదయమ్ము గునవీ ♦ రోత్సాహపున్ వేళ, నా

విద్యారణ్యయుగంధరాదుల యశో♦విస్తరమ్ము లగ్గించు, చీ
విద్యాస్నాతకు లాసఁ జేసెదరు, దే ♦ వీ! సంప్రసాదింపవే.

ఉ. జారిన దేశగౌరవముఁ ♦ జక్కనదిద్ది, మహాంధ్రమండలీ
భారము శ్లాఘనీయముగఁ ♦ బాలనఁ జేసి సమాన రాష్ట్రముల్
కూరిమి నాసఁ జేయ, తెలుఁ ♦ గుంబుడమిం గయిసేయుఁడయ్య, దీ
ప్తారతి నాంధ్రపుత్రులు! జ ♦ గజ్జనధర్మము దృష్టిఁ బిల్చుచున్.

శా. ఉల్లాసమ్మున మాతృసేవ పయిపై ♦ సజ్జాతింగాంగ నా
పల్లీ పక్కణ దిగ్దిగంతర తలీ ♦ పర్యంత వేంగీభువిన్
జల్లుండాంధ్రమహాకావ్యమ ప్రథమపూ ♦ జాపుష్పముల్ ప్రేమవుం
ద్రాళ్ళం గట్టుఁడు యావదాంధ్రజనసం ♦ తానమ్ము నాస్పైహితుల్.

సీ. రణరక్తబంధురా ♦ యణమైన క్షితి
కృష్ణ కత్తికడిగిన ♦ కవనభూమి ౧
అమృతాక్షరవికాస ♦ మయిన యా సుకవి పో
తన లేఖిని ప్రశాంతిఁ ♦ గనినచోటు ౨
భాషాకుమారిక ♦ ప్రభుఁ బెండ్లియైన
కృష్ణరాజ్యము వెలిఁ ♦ గినతలమ్ము 3
నానావిదేశనా ♦ కానీక విపులాశ్ర
యంబైన కేవురా ♦ పటిన తావు౪

---

౧. పాలేటియొడ్డు, ౨. ఒంటిమిట్ట, 3. విద్యానగరము, ౪. బాపట్లసమీపపు మోటుపల్లి.

గీ. పాడయి శిలావశిష్టమై ♦ ప్రాప్తకాల
మనుభవించుచు, నుండియు ♦ నక్కటకట!
బ్రతికిచెడ్డయాంధ్రుల పూర్వ ♦ వైభవంబు
చాటెడిని నాలకింపుడు ♦ శాంతమతులు!

మ. కలదాంధ్రోద్భవవల్లికాకుసుమ రే♦ఖామాలికాకాంతి తుం
దిలశోభాంకురపుంజముల్ భరతమా♦తృస్ఫీతచూడామణీ!
కలితచ్ఛాయల సందగింపఁగల భా♦గ్యంబింక, నీనాంగమం
గళకళ్యాణముఁ బాడఁబుత్రికలెవే♦డ్కన్ వత్తురానాఁటికిన్.

శా. సంతోషింపగదమ్మ! యాంధ్రజననీ! ♦ సారస్వతస్నాతవి
శ్రాంతిప్రీతుల, నీదుపుత్రకుల, దీ♦క్షాబద్ధులఁజూచి ని
శ్చింతన్ సోదరులార! భూజననిఁ బూ♦జింపుండు బ్రహ్మర్షణో
దంతవ్యక్తిమనోబలమ్మున దధా♦స్తంచున్ ఋషుల్ పల్కఁగన్



# ప్రబోధము



మరావతీపట్ట ♦ ణమున బౌద్ధులు విశ్వ
విద్యాలయములు స్థా ♦ పించునాఁడు
ఓరుగల్లున రాజ ♦ వీరులాంధ్రఘనముగాఁ
బలుశస్త్రజాలము ♦ నిలుపునాఁడు
విద్యానగరరాజ ♦ వీథులఁ గవితకుఁ
బెండ్లిపందిళ్ళు క ♦ ప్పించునాఁడు
పాట్నాకికి సమీపా ♦ మున నాంధ్రసామ్రాజ్య
దిగ్జయస్తంభ మె ♦ త్తించునాఁడు

గీ. ఆంధ్రసంతతికే సాహి ♦ త్యాభిమాన
దివ్యదీక్షాసుఖస్ఫూర్తి ♦ తీవరించె
నా మహావేళ మర్థించి ♦ యాంధ్రులార!
చల్లుఁ డాంధ్రలోకమునను ♦ క్షతిలు నేఁడు॥

సీ. తనగీతి యమృతపా ♦ తిని పాఠకులనుగా
దిద్ది వర్ధిల్లిన ♦ తెనుఁగువాణి
తనపోటులు విరోధి ♦ తండంబులకు సహిం
పనివిగా మెరసిన ♦ తెనుఁగుకత్తి
తనయందములు ప్రాంత ♦ జనులకభిరుచి వా
సన నేర్ప నలరిన ♦ తెనుఁగురేఖ
తనవేణికలు వసుం ♦ ధరను సస్యశ్యామ
లను జేయుఁ జెలఁగిన ♦ తెనుఁగుభూమి

గీ. అస్మదార్ద్రమనోవీథి ♦ నావహింప
జ్ఞప్తి కెలయించుచున్నాడ! ♦ చావలేదు
చావలేదు ఆంధ్రులమహో ♦ జ్జ్వలచరిత్ర
హృదయములు చీల్చిచూపుఁడో ♦ సదయులార!

సీ. కృష్ణాతరంగ పం ♦ క్తిఁ ద్రొక్కు త్రుళ్ళింత
నాంధ్రనౌకలు నాట్య ♦ మాడునాఁడు
ఇంటింట దేశి సా ♦ హిత్యదీపములతో
నాంధ్రతేజస్సు గా ♦ పాడునాఁడు
సుకుమారశిల్పవ ♦ స్తు ప్రపంచమునందు
నాంధ్రనైపుణి పంతి ♦ మూడునాఁడు
సమదసేనావ్యూహ ♦ జయపతాకల క్రింద
నాంధ్రపౌరుషము చెం ♦ డాడునాడు

గీ॥ చూచి, సంతోషమున తల ♦ లూఁచి, గర్వ
మూచి, ఆంధ్రపుత్రీపుత్రు ♦ లందఁగలరు
శాంతి, నందాక లేదు వి ♦ శ్రాంతి మనకు
కంకణవిసర్జనల కిది ♦ కాలమగునె॥



# పుస్తకము




ండాఱఁబాఱున ♦ ఖండగోదావరి
దాగిన చాళుక్య ♦ నాగరికత,
పాఁతైన పెనుకోట ♦ గోడల దీర్ఘధ్వని
ద్రులువోవు కాకతి ♦ ప్రాభవమ్ము
పల్లెపదాల జీ ♦ వమునిల్పికొన్న వ
ల్మీకివీరుల రక్తి ♦ నాళపటిమ,
కడలేకయేప్చు తుం ♦ గాభద్ర కెరటాల
మఱఁగిన ప్రాజ్యసా ♦ మ్రాజ్యభరము

తే. గీ. హృదయములువిన పలుకక ♦ చదువుజెప్పు
పుస్తకతపస్విని తెలుంగు ♦ పూలపొదల
నిలిచి సేవాశుకమ్ములఁ ♦ బిలిచిపిలిచి
స్థిరత పాడించుగాత జా ♦ తీయగీతి॥

సీ. ఆచారమునకు దా ♦ స్యముఁజేయుచును వంట
యిల్లుదాటఁగలేని ♦ యిందుముఖుల,
ఉదయాస్తమయములు ♦ నొడలిచెమ్మటఁదీసి
క్షేత్రసేవలుజేయు ♦ సేద్యగాండ్ర,
బ్రతికినన్నాళ్ళ తీ ♦ అనికస్తి, రెక్కలు
విఱిచిజీవించెడు ♦ పేదజనుల,
అక్షరపంక్తులె ♦ యరయరాదనుచు, దు
ర్గతులఁ ద్రోసిన చెప్ప ♦ రానివాండ్ర,

తే. గీ. పూలతోఁ నిండి కమ్మద ◆ నాలు చిన్న
పుస్తకనికుంజపుంజాళి ◆ పొంతఁ బిలిచి
"నాజనము, నాదు దేశ" మ ◆ నంగఁ జాలు
ఇంత జ్ఞానభిక్షాదాన ◆ మిమ్ము తల్లి!

సీ. ఆంధ్రుల శిల్పవి ◆ న్యాసంబు చూపించు
కలిమి గోపురముల ◆ గలదటంచు
ఆంధ్ర నాగరిక క ◆ ళ్యాణచిహ్నములైన
గానసాహిత్యముల్ ◆ గలవటంచు
ఆంధ్ర భాగ్యమ్ము మో ◆ యగ గౌతమీకృష్ణ
దరులను నావలు ◆ దిరిగెననుచు
ఆంధ్రవీరులకు స్వ ◆ ర్గాతిథ్యమిచ్చి పా
టలు పాడిన యుగమ్ము ◆ కలదటంచు

తే. గీ. చెప్పియొప్పించు పుస్తక ◆ శ్రీకుమారి
యుండగింపఁగఁ గల యాల ◆ యాములు గట్టుఁ
డాంధ్రదేశమునం దెల్ల ◆ నాంధ్రపుత్రు
లాప్తమానవసంఘ సే ◆ వానురక్తి॥

# వసంతము

[శ్రీ రవీంద్రనాథ ఠాకూరు రచితము.]




ను వచ్చానమ్మా ♦ నేను వచ్చానె
ఆలసింపక రారె ♦ ఆడుకొందాము.

* * *

ఏడాది తొలికాంగి ♦ తెచ్చి దాచారె ?
నా పూలపల్లకీ ♦ నేనో [illegible]రె ?
తేనె వసంతాల ♦ తీ[illegible]డి
పసుపుకోకలు పిరాం ♦ దసిదూడ దాల్చి
నేను వచ్చానమ్మా ♦ నేను వచ్చానె
ఆలసింపక రారె ♦ ఆడుకొందాము.

వేకువే వికసించు ♦ వేసాలమొల్ల !
పొద్దుపొద్దున పూయు ♦ మా [illegible] !

మవ్వముల్ రువ్వేటి ♦ మధ్యాహ్నమల్లె !
అందాలుపిదికేటి ♦ సందెసంపెంగి !
పరిమళం బెగబోయు ♦ పచ్చగోరంట!
పైరగాలికినవ్వు ♦ పడుము గేదంగి !

నేను వచ్చానమ్మా ♦ నేను వచ్చానె
ఆలసింపక రారె ♦ ఆడుకొందాము.

* * *

చూచినానోయి కు ♦ చ్చుల పూలరంగ!
నీముద్దురూపు వ ♦ న్నెలకోడెకాడ!
చిగురుపాగా చెంగు ♦ లెగిరి జీరాడ!
పడుచుప్రాయము తీవి ♦ పగిలిపోవంగ
తోపుచీరెలమావి ♦ దాపలిదిశల
విరజాజిపందిళ్ళ ♦ వెలపలిపొదల
  నిన్నుజూచానోయి ♦ నెఱజాణతునక!
  నీకు చిక్కానోయి ♦ పోకిళ్ళపుట్ట!

* * *

ఎవ్వరే ననుబల్క ♦ రించేరు ఇచట
మురళివాయిస్తు నే ♦ పోవుచుండగను

* * *

మావికొమ్మను నేను ♦ మన్మథాకార!
నిలువఁజాలనిరక్తి ♦ నిన్ను పిల్చేను.
నిన్నుజూడకమున్నె ♦ నీదివ్యమూర్తి
నీపూతవాసనల్ ♦ రాపాడి నన్ను
నాచిత్తబలమెల్ల ♦ దోచెంగదోయి!
నాగర్వరాగంబు ♦ లాగెంగదోయి!
నిన్నెఱుంగకముందె ♦ నిన్నుభావించి
ప్రేమించినానోయి ♦ బేలనై స్వామి!
  మావికొమ్మను నేను ♦ మన్మథాకార!
  నిలువఁజాలనిరక్తి ♦ నిన్ను పిల్చేను.

* * *

తొలిజాము చల్లగా ♦ తొలగినపిదప
ఆటపాటలరక్తి ♦ సొలసిన వెనుక
వీధిలోపల ధూళి ♦ వేడియెత్తంగ,
కడవల నీరాన ♦ కాక లేగంగ,
వేసవి తలసూప ♦ నేసొక్కిసోలి
నిష్క్రమింతావేళ ♦ నిలుతురే మీరు?
ఎవ్వరే నను బల్క ♦ రించేరు ఇచట
మురళీవాయిస్తు నే ♦ పోవుచుండగను.
నేను వస్తానోయి ♦ నేను వస్తాను
మొగ్గమల్లెను నేను ♦ మురిపాలమొలక!
నీయుత్తరీయంపు ♦ నీడబట్టికొని
నీకప్పురపుతమ్మ ♦ నిగ్గునందికొని
నీనిల్వుతిలకమ్ము ♦ లోన చెమ్మగిలి
నీరాగమాలలో ♦ దారమై పెనగి
వలపుతో కడదాక ♦ నిలిచియుంటాను
ఆసతోనందాక ♦ అంటియుంటాను.

* * *

సన్నజాజిని నేను ♦ సరసాలచైత్ర!
తేనెచిన్కను నేను ♦ తీపారుపుత్ర!
నీ సిగపూలలో ♦ వాసనై యణగి
నీకంఠమాలలో ♦ రేణువై కలసి
పూలు రేణులుకూడి ♦ పొలుపారుదాక
తమ్మితూడునుగూడి ♦ తనివొందుదాక

నీ వాక్కు కర్థమై ♦ నే వెల్గుతాను
నీ చూపు పాపనై ♦ నే నటిస్తాను.

*   *   *

ఎడబాట్లుకలిగేటి ♦ యెండకాలమున
ననుపీడించు కృశింపు ♦ ననరాణియెవతె?
నావేణువునకు ♦ ణాన్నగానూది
అప్పగింతలుపాడు ♦ నార్ద్రకాలమున
ఎల్లెడ కారాకు ♦ లల్లాడు వేళ
అంటియుంటా రెవ్వ ♦ రపుడు నాదండ.

*   *   *

గన్నేరుమొగ్గనే ♦ గరువాలగత్తె!
నిన్ను పెగహించాను ♦ నిండారకూర్మి
నీదు కౌగిట నన్ను ♦ నిలుపని మ్రొక్కాయి
నీశయ్య నన్ను రా ♦ సోంపని మ్రొక్కాయి
నీనవ్వు చల్వలో ♦ నానని మ్రొక్కాయి
నీలాలనసుఖాన ♦ సోలని మ్రొక్కాయి.
నేను వస్తానోయి ♦ నేను వస్తాను
వచ్చి నీవెనువెంట ♦ వలచియుంటాను.

*   *   *

మందారమును నేను ♦ మాధ్వీపిపాసి
నీదు పచ్చనిరూపు ♦ నేకోరినాను
ఏకిన్నెరస్వరాన ♦ ఎలుగెత్తి మన్ను

పిలిచితో ఆముద్దు ♦ పిలుపులోపల నె
కలదు నీదుపియోగ ♦ గద్గదస్వర మె.
నే నెఱుంగుదునోయి ♦ నీరహస్యములు.

*　　*　　*

ఎందుకో ఆలస్య ♦ మెందుకో అలత
ఎందుకో సందేహ ♦ మెందుకో కాఅత
అందుకోవోయి! మో ♦ హనసూత్రధారి
నా ప్రేమపూసలం ♦ దపుదండఁగట్టి.



# శుక్తి



వాఙ్మయము మహాంబుదధింబడి ప్రాకులాడు
దహరదహము నేను; శ్రాంతి విశ్రాంతిగాగ
తారకలు చూపిన దిశాపథంబుఁ బట్టి
రాగిణుల[1] కాళ్లయందెల రవళి వినసి.

*　　　*　　　*

నీరదములు నర్తించిన దారులంది
కాలఖేలన మొందెందుఁ గలయఁద్రిప్పి
నందు నందెల్లఁ బారవశ్యమునఁ బోదు
పరిమళము త్రిప్పు తుమ్మెదబాలలీల.

*　　　*　　　*

లేదు లేదు నిర్బంధపాలిత పథంబు
నా సువర్ణతరణికి విలాసమణికి.

*　　　*　　　*

ఒక్కవీచిముంపఁగ మఱియొక్కవీచి
తేల్పఁగ, నగాధ పాతాళ తిమిర మొక్క
మాఁ అపారనభం బొక్కమాఱుఁజూతు
పగలు రేలు పాటించెడి ప్రాణిపోల్కి.

*　　　*　　　*

కాటియందలి ధూమాంధకారభరము,
పడకటింటి కర్పూర దీపపు మెఱుంగు,

---

1 గాన పక్షమందు రాగశబ్దము స్త్రీవాచకము

నొక్కగతిని నానావకు దిక్కుఁదెలుపు
లేదు వ్యక్తికి ఛాయావిభేదమతము.

*　　　　*　　　　*

పోయిపోయి సంపాదింపనాయె నాకు,
ఒక్క శ్రావణ రజనీ వియోగవేళ
చినుకువన్నెల ముత్యపుఁ జిప్పయొకటి
తొలగిపోని తారకలె యిందులకు సాక్షి.

*　　　　*　　　　*

కడల కరడులు కరడులై వెడలుచుండె
మధుర జలధరపంక్తులు,—మాతృగర్భ
కుహరమునువీడు ప్రేమ పంక్తులవిధాన
హాదమును రామణీయము నందఁ బ్రకృతి.

*　　　　*　　　　*

లసదుమఃకంఠధవళమాలలు గనఁబడె
నెలలబాలింత స్తన్యధారలవిధాన,
భావరేఖయుఁ గుటిలకంపనముమానె
సుప్తవిరహిణి భ్రూలతాక్షోభఁ బోలి.

*　　　　*　　　　*

ఆమధురశుక్తిహస్తము నందగింప
కడలియొడ్డెక్కితిని;—కాని గానవైతి

కలయ వెదకియు వందెందు దొలుత నేను
దిగినసన్నపురేఁ వేమి దృగ్భ్రమంబొ?

*          *          *

తీరమునకుమాఱొడ్డి యుద్భిన్నములయి
క్షుభితకల్లోలగతిఁ గొట్టుకొనెడి యలల
గాఢకోలాహలంబింత గానరాదు
మెత్తని యిసుకపడకల నొత్తిగిల్లి.

*          *          *

అతివిశాల, మతిస్నిగ్ధ, మతిమనోజ్ఞ
మయిన యాతీరసికతాపథాంచలమున,
ఒకనియడుగులజాడ, వేరొకడువచ్చు
వఱకె నిలదు పారావారపాలనమున.

*          *          *

లేచిపడి నశించిన ప్రతివీచియందు
నుదయమందు వేఱొకనూత్న ముదితవీచి
చెఱఁగిపోయిన ప్రతిపాంథుచరణచిహ్న
ములను వేఱొకనికి శుద్ధతలముదొరకు.

*          *          *

ఆవిలాసము నాహృదయము హరించె
రజనిసంధ్యాకషాయ చిత్రమునుబోలె,

తిరుగుదింక, స్వచ్ఛందసుందరవిపంచి
కాలతాపశమగు స్వరగతివిధాన.

* * *

ఏను దెచ్చిన మృదుశక్తిలోని జాతి
ముత్యములను లోకముముందుఁ బోయువాడ
హృద్యమై యొప్పవారిని నేఁకొనుఁడు
అభిరుచికొలంది రౌద్రసౌమ్యముల నరసి.

* * *

సొగసుహృదయము సుకుమార సుమముఁబోలె
చేతి కందించువాఁడ రసికజనులకు!
కంఠమాలల ధరియింత్రొ గారవమున
రేకులనుఁజించి యావల పాఱేయనెంత్రొ!

* * *

రుచిచకితమైన హృదయసరోజగర్భ
మందుఁ గందళించిన భావ మంద మొంది;
వాణిమై యెప్డు నెలవగు వదనమందు
అపుడె సుకవికి స్వాధీనమయ్యెఁ గవిత.



# వసంతవికాసము

౧



తరుణ కుసుమశిఖా సూత్రధారి వగుచు
ముసుగు లేఁతల భేదము లోదవనీక
నిఖిల తరుజగతికిని నందించినావు
సహృదయానందరాగ రంజనము చైత్ర!

౨

కలికికోయిల గొంతులో మొలకగీతి,
సోయగపుఁ బూలపొత్తులఁ దీయతేనె,
పోసితో మెప్పు దప్పుడే పులకరించె
నాహృదయశయ్య కవితోపగూహనమున.

౩

కొమ్మ కొమ్మన, నాకు నాకున నలంది,
పూవు పూవునఁ, జివురు చివురునఁ జిందఁ
జిలికితివి నూత్నచైత్ర కాశ్మీరరుచులు
పుడమి నవకమ్మునకు వన్నెలిడ వసంత!

౪

మోళ్ళు మోసెత్త నిల మూలమూలలందు
నందమెగఁబోయు చైత్రుని యాగడముల
కీర్ష్యఁబడి మేలిమసుగింత మొత్తె గగన
భామ, తనకన్నెతపసెల్ల భంగపడఁగ.

౫

మోదమున మోజుపడి కుసుంభాంశుకాల
మంగళించిన యువని నానందబద్ధ
నయనములఁ జూచి చూచి యున్మాదియయ్యె
మధుతపస్వి కింకే భాషింతమొ నడవ?

౬

పొదలవాకిండ్లు తెఱచి యాపుష్పపుత్ర
కులను, నూతనావిర్భావ కోమలాస్య
రేఖ లెత్తించె స్వచ్ఛంద ప్రియుఁడు చైత్రుఁ
డార్ద్రరాగాక్షతలు నల్లి యువనిమీఁద.

౭

ఏమిటికిఁ బొంచిపొంచి లాలించెదోయి!
బాళి బాల గులాబీల జాలిమాలి,
మొగము లెత్తవు; లజ్జచే వలపు మొలక
దాటిరాలేక ఱెప్పల దాగులాగు.

౮

చక్కని నభంబు రంగులఁ బిక్కటిల్లె
నిండుజవ్వని యారుణంపు గండముల్లు,
రాగగీతలఁ జెలరేగ భోగపవనుఁ
డప్సరసల నృత్యోత్సవ లిప్సలీల.

౯

వీధికడపటి వ్యాకుల వేణుకుంజ
మాలపించె హ్లాద మనోజ్ఞమయిన పాట,
కోమలసమీరుఁ డాడించు కులుకుకొమ్మ
త్రిప్పులనుఁగూడ గాసమే కేకలెత్తె.

౧౦

పవను నడుగుల రవళికిఁ బట్టికెరలి
కెవ్వుకెవ్వున నవ్వు పక్షినిచయంబు,
తల్లిపొలకువ నాలించి దాదికోలఁ
గిలకిలల మేలుకొను బాలికలవిధాన.

౧౧

పత్రవస్త్రాపహరణ విచిత్రుఁడయిన
శిశిరు వివృతవిజిజ్ఞాస నీసడించి,
చిగురుచెంగావి కోకలిచ్చితివి మాధవ
నీమతల్లుల సంవృతనీతి నెఱిఁగి.

౧౨

మొగలిరేకుల మును వర్షపుత్రకుండు
వ్రాసిన శుభాక్షరంబులు మాసిపోయె,
అధరరేఖవంటి కషాయ మధురపల్ల
వమున నీవైన చెఱఁగని పంక్తి నిలుపు.

౧౩

ఏదెసను ద్రెంచితి జగంబు నేమరించి
మధురగీతా సరసిగట్లు మధుపిపాసి!
అఖిలమానందసుఖసుప్తమయ్యె నింక
మేలుకొలుపు వైతాళికులే రారు!

౧౪

తేనెఁ దిని సర్తనాసక్తిఁ దియగు సఖులు
పాయలై పాయలై గానఁబడిరొఁ గడల,
స్నానగంధవాసనలు సాంద్రముగఁ బెరయ
నాఅవిడచిన మనులక్ష్మి యాలకలనఁగ.

౧౫

ఇగురుమావులఁ గోడెకోయిలల లేపి,
మిసమిసలపూల చెఱఁగులఁ బసపుఁబూసి,
పచ్చివలపుకాకల నెత్తుపడిన రాగ
సరళిఁ బాడించెను వసంతి! జగతిచేత.

౧౬

సమదపికములు పాడు స్వచ్ఛందగీతి,
దక్షిణసమీరుఁడేగు స్వాతంత్ర్యవీథి,
స్వేచ్ఛగాఁ బూచె మంగళగుచ్ఛలతలు,
జగతినేల నూత్నప్రాణ మొగయు దింక.

౧౭

సుఖనిశీథము, గీతికాముఖరపథము,
సరసపవనము, సుమదళచకితవనము,
పెనఁగి నిలువంగనీయవు మనసులోని
ప్రియగతులఁ గంఠముఖమునఁ బెకలకుండ!

౧౮

చచ్చిపోవు కారాకుల స్థానములను
చిగురుచేతలు మొలుచు సౌష్ఠవముగనుము,
మృత్యువునకేలో భీతివహింత్రు జనులు
అవల స్వచ్ఛందసౌందర్య మబ్బుచుండ.



# శేషచైత్రము



రుగు పుట్టిండ్లలో ♦ నెదిగిన యెలమి
కొమ్మల యొదులలోఁ ♦ గులికిన కలిమి
మృదువనస్పతులలో ♦ మలగిన చెలిమి
వైశాఖమును జూచి ♦ వదలదే చైత్ర!

౨

పూల కౌగిండ్లలో ♦ నోలలాడితివి
సరసుల పొత్తులో ♦ సఖ్య మాడితివి
పసిపైరగాలిలో ♦ పరువు లాడితివి
మండుటెండల సవి ♦ మానెదే చైత్ర!

౩

రమణుల చరణాల ♦ రాచిన లాక్ష,
అబలల యధరాల ♦ నంటిన తమ్మ,
కన్నెల నుదురుల ♦ కందిన చాదు
ఎన్నాళ్ళు మురిపెమో ♦ యెఱుఁగుదే చైత్ర!

౪

కోయిల పాటలోఁ ♦ గోమల స్వరము
మలయమారుతములో ♦ మధుర వాసనలు
కలికి పూగుత్తిలోఁ ♦ గమ్మని మధువు
అనుభవించెందాక ♦ నందాల చైత్ర!

౫

పత్రాలు రాల్చితి ♦ పచ్చనిచెట్ల
జీవనక్షామమ్ముఁ ♦ జేర్చితి నదుల,
పనిపాట లావల ♦ బంపితి విఁడ్ల,
చాలదే నీపాలి ♦ జయమింకఁ జైత్ర!

౬

మధుపాతమున భూమి ♦ మురిపించినావు
సుఖరక్తిఁ బ్రజలను ♦ పాలించినావు
పగలు దీర్ఘములుగాఁ ♦ బాటించినావు
చాలవె యీనాళ్ళు ♦ చక్కని చైత్ర!

౭

కష్టమో సౌఖ్యమో ♦ గడపితి విచట
నీ మంచి కాలంబు ♦ నీటుగో పొగయు
దుఃఖింప కవసాన ♦ దురవస్థ కిపుడు
కాలచక్రము నాప ♦ గా లేము చైత్ర!

౮

నవనవ లాడేటి ♦ చివురాకులెల్ల
కఱకెక్కె నెండ కా ♦ కలుబోలె ముదిరి,
సవ్యవాతములు దు ♦ స్సహములై రేగ
నిప్పులు గ్రక్కుచు, ♦ నెంహ్యంపు చైత్ర!

౯

నీ సౌఖ్యసంపదల్ ♦ నీ భోగరుచులు,
గ్రీష్మున కిట్టు ల ♦ ర్పింపఁగా వలసె
నంచు నాకులపడ ♦ కవసాన చైత్ర!
ఉదయాస్తమయతత్వ ♦ మిదియె సుమ్మిలను!



# పూవు

౧



చెలియల సిగలోఁ ♦ జెలువారు పూవ
పడతుల జడలపై ♦ బవళించు పూవ
సఖుల ముచ్చటముళ్ళ ♦ సవరించు పూవ
లలనావతంసమ్ము ♦ లను గుల్కు పూవ
పోవకే! మాతల్లి ♦ పూజకో పూవ!

౨

అఱ విచ్చి సిగ్గులఁ ♦ గరఁగేటి పూవ
మొగ్గవై మోజులఁ ♦ మొలిపించు పూవ
పూచి శోభనములఁ ♦ బొదివిన పూవ
దళముల కౌగిలిం ♦ తలఁజొక్కు పూవ
పోవకే! మాతల్లి ♦ పూజకో పూవ!

౩

చిగురాకు మరుఁగునఁ ♦ జెలువారు పూవ
కొమ్మలసందిళ్ళ ♦ గొనలెత్తు పూవ
ఎండకు కాగని ♦ యెలపూత పూవ
వెన్నలఁ పేరని ♦ వెలుతురు పూవ
పోవకే! మాతల్లి ♦ పూజకో పూవ!

౪

కడుపులో తేనెలు ♦ కల కన్నెపూవ
తనువున గంధాలు ♦ దయివారు పూవ

రెక్కల నందాలు ♦ గ్రక్కేటి పూవ
మోమున లావణ్య ♦ ములు రాలు పూవ
పోవకే! మాతల్లి ♦ పూజ కోపూవ!

౫

పసుపు కేసరములకా ♦ మిసిమించు పూవ
నిగనిగ సొగసులకా ♦ బిగివోని పూవ
పెండ్లింట్లపాలించు ♦ ప్రేమంపు పూవ
వీరుని కంఠాన ♦ విప్పారు పూవ
పోవకే! మాతల్లి ♦ పూజ కోపూవ!

౬

కాపుకన్నియ కొప్పు ♦ నైసేయు పూవ
ఉపవనాల నుయ్యాల ♦ లూగేటి పూవ
తోటకంచెల వన్నె ♦ తోఁ బూచు పూవ
అడవిడొంకల నంద ♦ మయియొప్పు పూవ
పోవకే! మాతల్లి ♦ పూజ కోపూవ!

౭

సెలయేటి పాటలకా ♦ చెవియొగ్గు పూవ
తుమ్మెద సఖులతో ♦ తుళ్లేటి పూవ
పైరగాలికి విచ్చి ♦ వర్థిల్లు పూవ
రంగుల రాశివై ♦ రాణించు పూవ
పోవకే! మాతల్లి ♦ పూజ కోపూవ!

౭

కళలకళ్యాణివే ♦ కమ్మని పూవ
సౌందర్యసరసివే ♦ చక్కనిపూవ
భావాలబరిణవే ♦ బంగారు పూవ
చిన్నెలచిలుకవే ♦ సింగారి పూవ
పోవలే! మాతల్లి ♦ పూజ కోపూవ!

౮

పెరిఁగినా! తరిగినా! ♦ ప్రియమేనె పూవ
చచ్చినా! బ్రదికినా! ♦ స్వర్గమే పూవ
ఓడినా! గెలిచినా! ♦ మెప్పేనె పూవ
తొలఁగినా! కలసినా! ♦ తోడేనె పూవ
పోదాము! ఆతల్లి ♦ పూజకే పూవ!

# పూజ

౧



చందమామ పూవెన్నెలల్ ♦ జల్లులాడ
పిల్లఁ బులకరించఁగ నెల ♦ యేళ్ళు పాడ
విశ్వమునఁ బచ్చతోరణాల ♦ విరిసియాడ
వ్రేలవే! తల్లిమెడను పూ ♦ జాలలంతి!

౨

కొదమతేళ్ళను వెరవేది ♦ పొదలు వెడలి
చిన్ని మొక్కలు నైనను ♦ చేవ గ్రక్క
జీర్ణ మురళియు మ్రోగను ♦ జీవరుతుల
వ్రేలవే! తల్లిమెడను పూ ♦ జాలలంతి!

౩

పొంగిపొడిచిన నములెల్ల ♦ క్రుంగఁజూచి
ఆకసముఁ బ్రాకు వరపసూ ♦ క్లింగఁ గాంచి
త్రుళ్ళి త్రోపాడు మేఘముల్ ♦ తొలఁగసరసి
వ్రేలవే! తల్లిమెడను పూ ♦ జాలలంతి!

౪

సస్యములకుఁ జాలిచ్చు వా ♦ త్సల్యవతులు
మంగళతరంగిణులు, క్షీర ♦ భంగి చెప్ప
నాలకించితి భావర ♦ హస్యములను
వ్రేలవే! తల్లిమెడనుపూ ♦ జాలలంతి!

౫

చెరగిపోని చక్కని లిపిఁ ♦ జెక్కినారు
తాల భాగ్యభారతి శాస ♦ నాల ఋషులు
వానదెబ్బల తుడిపివడు ♦ వ్రాసె, చదవి
వ్రేలవే! తల్లిమెడను పూ ♦ జాలలంతి!

౬

తెలుఁగునెత్తుట వెలిగిన ♦ దీపకళలు
తెలుఁగుపాలఁ బేరిన మీఁగ ♦ డల తెరకలు
తెలుఁగుతేన తీయందన ♦ మ్ములను దనిసి
వ్రేలవే! తల్లిమెడను పూ ♦ జాలలంతి!

౭

భక్తుఁడొక విగ్రహము తల ♦ పయిననుంచ
వీరుఁడొక ఆయుధము మీఁద ♦ బెట్టి గొలువ
కర్షకుండొక కాడికిఁ ♦ గట్టి మ్రొక్క
వ్రేలవే! తల్లిమెడను పూ ♦ జాలలంతి!

౮

కన్నె పసుపక్షతలు నల్ల ♦ గౌరిపేర,
దేవిపేర కుంకుమను శా ♦ క్తేయులీయ,
విప్రులు సరస్వతీదీక్ష ♦ విరులొసంగ,
వ్రేలవే! తల్లిమెడను పూ ♦ జాలలంతి!

౯

కవులు కవితామధువుచే జ ♦ గమ్ముఁ దడుప,
శిల్పకులు కుంచికలఁ జేత ♦ తెలుపు దిద్ద,
గాయకులు గాత్రరక్తిరా ♦ గముల నెత్త
వ్రేలవే! తల్లి మెడను పూ ♦ జాలలంతి!

౧౦

పంజరములోని చిలుకల ♦ పాటలందు,
అడవిలోని గోర్వంకల ♦ నుడులయందు,
ఒక్కటే శ్రుతిచెదరక ♦ పిక్కటిల్లె
వ్రేలవే! తల్లిమెడనుపూ ♦ జాలలాంతి!



# విరహవీధి



హేమపాత్రల చందన ♦ మెండిపోయె
ద్వారములు మోయుచున్నవి ♦ హారములను
సోనలం దింకె స్నానక ♦ షాయగంధ
ముబల! యెవనికోసము సగ ♦ మయి కృశింతు.

గీ. చెక్కుచెదరని పాపట ♦ చిక్కువడియె
వేణిబంధము శిథిలమై ♦ విడుదలందె
కరఁగి జారగిన తిలక రే ♦ ఖలను దుడువ
వతివ! యెవఁడాహరించె నీ ♦ యార్ద్రహృదిని.

గీ. పాలుపొంగినగతి పొంగు ♦ ప్రణయరక్తి
నాపుకొనలేని పడుచు ప్రా ♦ యంబుతోడ
నమ్మి యెవనికి నీమన ♦ మమ్మికొంటి
పువిద! యీమేఘమాస న ♦ వోదయముల.





# పి లు పు

నిశలు పులకించెఁ గనులకు నిదుర రాదు
పైదలి! యేమిటికి నన్ను బాధపెట్ట?
ఏపొదలదాఁగి పాడె దీ హృదయదళన
దారుణములైన నగ్నగీతమ్ములెత్తి. ౧

నావిరహగంధగీతి కన్యాయముఁ జెప్ప
శిరసు లెత్తుచు నున్నవి చిగురుపొదలు,
నవ్వుచున్నది కడల నందంపుసందె
కావిరంగుల రంగైన మోవివిరిచి. ౨

కొసరియాకుంబసపు చెఱఁగులనులాగు
గంధవహుని కౌఁగిటనుండి కరుణవదము
లల్లుచున్నది శ్రుతులఁ బ్రాయంపువంశి
నాహృదయ వేదనాలాపనములఁ గరఁగి. ౩

వలపు పచ్చనిదని రక్తిమొలవఁబాడి,
విరహ మరుణమని యెద తపింప విసివి,
చెలిమి నల్లనిదని నిరసింతు విపుడు
ప్రేమ ధవళిమమని యింక వినుతు వెపుడు! ౪



# మధుమాలి



ఆకసమ్మునఁ బూవులే యందగించె,
వసుధకడుపునఁ బూవులే పవ్వళించె,
అలయమ్మునఁ బూవులే యాటలాడెఁ,
ఏలపాడదు తుమ్మెద పూలపాట. ౧

పవనుకౌఁగిటఁ బూవులే సవదరించె
హృదయమందునఁ బూవులే రేకులెత్తె;
తోఁటలోపలఁ బూవులే తొలకరించె,
ఏలపాడదు తుమ్మెద పూలపాట. ౨

ఎన్ని యెన్ని భవంబుల నేమియేమి
పూజలను జేసి పట్టితి పూలనోము!
చైత్రు సహవాససుఖము లేచాయ నబ్బె
తేలసేయుము తుమ్మెదా! పాటఁబాడి. ౩

## తుమ్మెద.

కష్టములను శారదచంద్రికలవిధాన,
దుఃఖములను తొల్కరివానతునుకలట్లు,
లనుభవించితి,—చిత్త మాహ్లాదపులక
వివశమయి సేయునృత్యముఁ విడువకుండ. ౪

స్తన్యభరశీతలంబైన జననియొడిని,
పరిమళప్రగాఢమగు భామపాన్పునందు,

వేదఋక్పూతమగు యజ్ఞవేదిమీఁద
నెఱమి—నాదుకౌమారమే నిలిపికొంటి. ౫

ఆటలాడితి వెన్నెల యలలపోల్కి,
పాటలనుబాడితిని సెలయేటిపగిది,
సంకెలలు కాళ్ళయందెల చాయఁగొంటి,
అన్నిటను—బాల్యలీలలే యనుభవించి. ౬

పాటలు తలాడఁగాఁగ ని పవ్వళించి,
పాటలను జెలికత్తెలభాతిఁ బిలిచి,
పాటలే నవయాత్రకుఁ బథముఁజూప
వచ్చితిని, యింపకిమ్ముల పాటతోడ. ౭

ఇంతకన్నను నోము లే నితర మెఱుఁగ,
ఈశ్వరుఁ డనుగ్రహించె నాకీ భవంబు.
నవ్వుచునె బుట్టి, నవ్వుచు నవకమొంది,
నవ్వుచునుబోదు—నిదియె నానగ్నలీల. ౮

పాంథుఁడు.

మధుప! యేటనీ చంచలస్వనముఁ గొంటి
వాక్కుపువునకుఁ బెట్టుదు 'చక్కిలింత'
లోకశ్వసనవునఁ బాసింపుముఁ గ్రుక్కకొందు
వాక్కుపూవును గీతికో నుత్సవింతు. ౯

అంతులేనియాంకసమునఁ గొంతిసేపు,
కుటిలపవనవిచికలందుఁ గొంతసేపు,

కువలయోన్మీలరేఖలఁ గొంతసేపు,
త్రుళ్లిపడుచుఁ దిరిగెదు మత్తునివిధాన. ౧౦

తుమ్మెద.

చంచలుఁడనౌదు నవనికిఁ జలనమొసఁగ,
విరహినగుదు శుష్కితులకు వేడిదార్ప,
మత్తుడనగుదు జడులకు మత్తువెట్ట,
లేదులే దస్మృతం బించు లేశమయిన. ౧౧

ఒక్కపువుపొంత నాడుదు, నొక్కపూవు
పజ్జఁబాడుదు, నొకపూవుసెజ్జమీద
శిశువువలె నిదురింతు నీ చిత్రదశల
చక్కదనములులేక నా జన్మమేల? ౧౨

చిత్తచాంచల్యమన్నను సిగ్గులేదు
మతిభ్రమణమనినను నవమానపడను,
నన్ను నాపూలనెడఁదీసి భిన్నభిన్న
మార్గముల కీడ్వకున్న నమస్కరింతు. ౧౩

తారలన్నను, మణులన్న, తనయులన్న
పులుఁగులన్న, గీతములన్న, పూవులన్న
నామవాచక భేదముల్ నాకుమాత్ర
మన్నియును బూవులేయగు నార్ద్రదృష్టి. ౧౪

పూలకొఱకయిపుట్టితి, పూలలోని
తీయతేనెను దీయుచుఁ దిరుగువాఁడ,

నెపుడు నాడుచుఁ బాడుచు నిదియె—నిజము,
భ్రమయొ; యున్మాదమో; కైపో; వలపో; సొలపో! ౧౫

ఈమధువ్రతమును తుద కెల్లజరిపి
వదలుమను తేనె పెరలతోఁ బాటు పృథివిఁ
బిదప నరయుఁడు చంచలహృదయచంచ
రీకగీతిసంగ్రహమును బ్రీతితోడ. ౧౬

ప్రేమచేఁ జెమ్మగిల్లిన హృదయరాగ
ములను నడిపింప కాల్వ లెందులకు త్రవ్వ?
నడువనిమ్ము నచ్చినభంగి నొనపుసొంపులయు
వాలకముతో నెడాపెక వాఁకలట్లు. ౧౭



# గీతాం వేహి

౧



కన్యా మీరాబాయి.

ఇంత తపించెద ♦ వేమిటి కింతీ!
కాంతి విరహమున ♦ కగ్గి కృశింప
వలపులువాడిన ♦ ఫలమేమిగలదు
వాసనపోయిన ♦ ప్రసవము లేల.

ప్రేయసివని నడి ♦ రేయి నేతెంచి
వాకిట నిలచినఁ ♦ బలుకకపోతి !

సంజెకడల నిండు ♦ సంపెము కురులు
దువ్వుకొనుచున్న ♦ నువ్వపు సొగసు
చూచిచూచి సకియా! ♦ సోలినమనసు
ఆశఁజాలక విర ♦ హాంబున వెడలి.

మెల్లమెల్లన నును ♦ పిల్లనగ్రోవి
వాయించినాను నీ ♦ వాకిలిముందు
చూడవైతివి నను ♦ సుందరి యెపుడు
కడగన్నుల రాగ ♦ కళికలు గురియు.

పొదలిన పయ్యెద ♦ చెంగులు గనక
చెమరించు చెక్కుల ♦ చేష్టలు గనక
ఉయ్యాల లూచెడి ♦ యుత్తమవేళ
కియ్యాలు సవరించు ♦ తియ్యనివేళ.

నీహృదయము కరు ♦ ణించునో యనుచు
నీరాగములు రవ ♦ ళించునో యనుచు
అలత "గీతాందేహీ" ♦ యని పాడినాఁడ
"ధన్య మీరా"యని ♦ తలపించినాఁడ.

నాగర * గురుచర ♦ ణంబుల మరఁగి
లోకాపవాద వి ♦ లోలత కడలి
ననుజూడ లజ్జించి ♦ తనుపమగాత్రి!
ననుఁగూడఁగ నను ♦ మానము పడితి.

౨

## దాసీక్షేమ.

సాధింపులేలోయి ♦ సాహసకాఁడ!
ఈదీనురాలితో ♦ నేమి వాదాడ
నీరూపురేకల ♦ నెమ్మది వలచి
ఎన్ని వెన్నెలరేల ♦ నీడ్చితి వగల.

మబ్బులు గ్రమ్మిన ♦ పూవులయందు
పులుగులు పాడిన ♦ తొలిజాములను
నీనీడలే భ్రమ ♦ లోన నీక్షించి
నీయడుగులజాడ ♦ నే యాలకించి.

నడిరేయి యనకయె ♦ నకనక పడుచు
పడకటింటితలుపుల్ ♦ ఘణ్ణున తెఱచి

* నాగరుఁ డను తాపసి మీరాబాయి గురువు

త్రుళ్ళుచు నటునిటు ♦ త్రోవలు సూచి
యడియాసపాలయి ♦ యారడి కడలి.

అందెలు మ్రోగునో ♦ యని జంకిజంకి
కుచ్చెళ్ళ పెళపెళ ♦ కను కుంగికుంగి
సిగ్గున మ్రగ్గుచు ♦ జింతఁ గములుచు
ఎన్నెన్నివారులు ♦ చిన్నవోయితిని.

మీరాబాయి, క్షేమ—వీరు ఉత్తర హిందూస్థానపు భక్తురాండ్రు. వీరు పాడిన గీతములు భక్తిపరవశములుగ గానము చేయబడుచున్నవి. ఈపై రెండుపాటలును హిందీపదములకు యథానువాదములు.

మీరాబాయి

నీతిమాలిన దని ♦ నిందించెదరు
జాతిజాఱిన దని ♦ శాసించెదరు,
సిగ్గువిడిన దని ♦ చిన్నమాటాడి
పరవశురాలని ♦ పాపముల్ పలికి,
వీధులఁ బోవఁగ ♦ వేలెత్తి చూపి
నొవ్వఁజేసిరి నా ♦ మవ్వపు మనసు
విసపు గిన్నియ నా ♦ పెదవిని జేర్చి!
కసిదీర్పుమా " నా ♦ గర " గురుమాళీ!



# ప్రవాసరాధిక

చ. చదలు పయోదమాలికల ♦ శ్యామలమయ్యెదమాలపంక్తులన్
కొదమ వనమ్ము చీకటుల ♦ కున్ నెలవయ్యెఁ, గుమారభీరుఁడీ
యదుసుతుఁ డిల్లుఁజేర్చు మని ♦ యానెడి నందని దేశ మాలకిం
చి దెసలు సూచుచుం జనియె ♦ స్నేహతపస్విని రాధ యొంటిమై.

మ. కడలం గాల్నడ నేగు ప్రోఁచుల సైగల్ ♦ గానఁగా రావు, చే
పెడు పాలిండ్ల రుచుల్ మరుల్ గొలుపగో ♦ వృందమ్ము పోలేము, పెం
పుడు లేళ్లైనఁ గదంబకుంజముల దా ♦ పుం జేర వీసంజరా
యిడి వీక్షముఖముందు నెందలసితో ♦ యీ! ముగ్ధగోపాలకా

గీ. చెదరి విరిసిన యాఁబెయ్య ♦ కదుపులెల్ల
మందఁ గొనఁగ నాకర్షించు ♦ సుందరాను
రాగ రాగగీతికలైన ♦ రావు కృష్ణ!
యెంత చెవియొగ్గి వినిన నీ ♦ ప్రాంతమందు.

ఉ. పచ్చని యాకుజొంపముల ♦ పైఁబడు నందపు సందె వన్నియల్
విచ్చిన సిసిగన్ ప్రతిఫ ♦ లించిన మించులు నేని దోఁప వీ
ముచ్చటయైన తోఁపున వి ♦ ముగ్ధుఁడ! దట్టపు చెట్లనీడలం
జొచ్చితొ? యల్లిక్రొన్నసాగ ♦ సుం బొదలంగను చాటులైతివో!

చ. పొనపొనబూలపిండికణ ♦ ముల్ కణముల్ దొరలంగపూత మో
చిన మొలదీవ యిండ్లకడఁ ♦ జిక్కని నీ చరణాంక రేఖికల్

గనఁబడ, వార్ద్ర దర్భలుస♦గమ్ముసగమ్ము గ్రసించు చావలన్
జవిన కురంగపుత్రికలు ♦ సైతము చూపవు నీదుజాడలన్.

ఉ. పాదములొత్తుకో నిసుక ♦ వాగుల రేవుల కాలుఁ ద్రిప్పి యా
యాదరులం బ్రదోషసము♦యా ప్రియ రాగములాలపించు వే
ణూదయభాగ్యమొందఁగ♦నోయి? కుమారయశస్వి! పల్లవ
స్వేదములై కఱంగిన స♦సిన్ వెలయింపవు పో వనస్పతుల్.



# సఖీసంవరణం




(రవీంద్రమహాకవి పదావళినుండి తెనిగింపఁబడినది)

తవింతలె నాడు ♦ కాంతుని వగలు
సెగలయి నాయెడ ♦ తెగ దహియించు
కసికర మెఱుఁగఁడె ♦ కపట నాటకుఁడె
ఆమదాని రహస్య ♦ మారయ లేడె

అబలల కతిథిగా ♦ నరుదెంచు ప్రియుడు
సందెలు గ్రుంకక ♦ ముందేలరాఁడో?
చిరగట్టక మెయి ♦ సింగారములు
సవరింపక పూల ♦ సరులు ముడువక
ప్రాలుమాలికతోఁ ♦ బవళించియుండ
బిరబిర వచ్చునె ♦ ప్రియవల్లభుఁడు
ఏమని వలదంచు ♦ నా మోహానుని
కాదని పల్లెత్తి ♦ వాదాడలేనె;

దినమంతయు తఱి ♦ తీపితోఁగడపి
సందెలఁ బిలుచుచు ♦ సఖులను బంపి;
నగలు పెట్టుకొని యం ♦ దమ్మ్రులు దిద్ది
సన్నపావడ సోగ ♦ సారగఁ గట్టి
కర్పూరపు దీపి ♦ కలు వెలిగించి
పరిమళములు చిమ్ము ♦ పాన్పు లమర్చి
పన్నీరొలికెడి ♦ పందిలిచాయ
రాయంచలాడు స ♦ రస్సులకెలన

వీణతంతుల నాల ♦ పించుచుఁ గొంత
వేణుగీతల వల ♦ పించుచుఁ గొంత
తనకోసము విరాళి ♦ తాళఁగలేక
ప్రణయావేగము మది ♦ భరియింపలేక
జాలతనంబున ♦ వేచిననాఁడు
నాచాయ రాఁడేమి ♦ నా నాయకుఁడు
నన్నుజూచుచు వద ♦ నం బటు త్రిప్పి
తొలఁగిపోవును "పిర ♦ తోడే" చెలియా!
సైపఁజాలక లేమి ♦ దీపము దీసి
శయనింపఁబోయెడు ♦ సమయమునందు
చోటిమ్మని నోలు ♦ చును వచ్చు సఖిరో!
లేదని వల్లెత్తి ♦ లేనప్పుడైన
వాకిటి పొంత నా ♦ వల్లభుఁడుండ
చూచి రోయఁగలేదె ♦ సుదతి నామనసు.

* * *

తోడివారలు వేను ♦ త్రుళ్ళుచునుండ
పెడత్రోవల తాను ♦ నడుచునె ప్రియుఁడు
వంచిన మొగమెత్తి ♦ కాంచఁడే యొరుల!
పరితాప మించుక ♦ పలుకఁడే హితుఁడు.
నాథుని చేష్టల ♦ నామదిఁజూచి
ఆనందమే మిథ్య ♦ యని తలపోతు.

ఒక్కొక్కమాటు వి ♦ యోగపు వగల
హృదయ మింతింతలై ♦ చెదరి తపింప;
తీయని ప్రేమకుఁ ♦ దోయిలిఁబట్టి
ఆసపెట్టిన యడి ♦ యాసకు మ్రొక్కి;

"అబలల హృదయము ♦ లధివసియించి
పరిపాలించు నో ♦ ప్రణయతపస్వి!
పరులఁ బ్రేమించుట ♦ పాపము సుమ్మి!
అంతకన్నను కష్ట ♦ మపరని లేదు.

జగముల నేలెడి ♦ సర్వమయుఁడవు
రాగసులఁ గరగెడి ♦ సుందరాంగుఁడవు
ఆనందసాగర ♦ మం దందమయిన
గడుసుబంగరు నావ ♦ నడుపఁగ లేవె?
అన్నెముఁ బున్నెము ♦ నారయ లేని
ఈయబలల భ్రమి ♦ యింపగనేల?
నీవునీవని లాల ♦ సీయపుగతుల
నమ్మువారిని వగ ♦ కమ్మఁగనేల?
ఈయూడుంబుట్టు ♦ విఁక నాకుఁ జాలు
పూలదండఁగ నను ♦ బుట్టింపవోయి!
తమ్మిపూవుగ నను ♦ దయజూడవోయి!
కనకచేలముగ నన్ ♦ గరుణింపవోయి!"

అని తలపోసెడి ♦ యర్ధరాత్రముల
విసివి వేసారిన ♦ విసమపు నిశల

ప్రాణముపైఁ గాంక్ష ♦ వదలిన వేళ,
ప్రేమపైన విరక్తి ♦ ప్రాఁకిన మొదల,
కిలకిల నవ్వుచు ♦ కేళీనిరతి
నందగాఁడై చెల్వ ♦ చిందెడు వగల
ననుడాయఁగవచ్చి ♦ నానిద్ర లేపి
నను పరవశఁ జేయు ♦ నానాగతుల;
తహతహఁ దార్చు వి ♦ రహబాధ లెల్ల
అప్పు డసత్యము ♦ లని యెంచికొందు.

*　　　*　　　*

ఎన్ని తిప్పలు పెట్టి ♦ యెంతే వేచినను
ఎడబాయఁజాల దీ ♦ హృదయం బతని
పలుభవముల యందు ♦ పలువేసములను
ననుగరగించిన ♦ నాయకుఁ డితఁడు,
అభిమాన మెడలిన ♦ నవమానమయిన,
అఖిలలోకమ్ములు ♦ నాడిపోసినను
నాథునిపై నిల్చి ♦ నగ్నమ్మయిన
నాయనురాగము ♦ మాయదు చెలియ!

*　　　*　　　*



# మేఘము

శా. ఆకాశంబున జీలుకాడె సొగసై ♦ యాషాఢయోషాసితం
బాకీర్ణాలకజాలకంబులన పా ♦ యల్ పాయలై మేఘముల్,
రాకాచంద్రవిలాసముల్ ముసుఁగువా ♦ ఱన్ నైల్యమాల్యంబులై
ప్రాకెన్ జీకటిచెట్లసోయగపుప్రా ♦ రంగుల్ దిశాంతమ్ములన్.

సీ. చినుకుచిన్కనకుఁ జీ ♦ లిన చిన్ని రేకుల
తోడ పద్మంబు ల ♦ ల్లాడఁ దొడఁగె
ధారధారను మాఁపు ♦ తెగిలిన చిగురుల
తోడ కొమ్మలు సొంపు ♦ లోడఁగడఁగె
జల్లుజల్లునకుఁ దృ ♦ ష్ణలు సళ్ళు తీయుమ్మ
తోడ చాతకము ల ♦ ల్లాడసాగె
ఉరుమురుమునకు నం ♦ కురమైన మొలకల
తోడ వేఁపువ్వులు తూ ♦ గాడనయ్యె
గీ. ఖేదమును మోదమవనికి ♦ గీలుకొలిపి
ప్రోషవము నటియింతు వా ♦ షాఢలక్ష్మి!
పల్కులేక ప్రాల్మాలు నా ♦ నాల్కగూడ
క్రొత్త చక్కిలిగింతల ♦ గుస్తరింప.

ఉ. ఎండిన బీళ్ళయందు నద ♦ యించిన పచ్చిక కండ్లపండువై
యుండగ చూడియాలుతల ♦ లూపుచుఁ బోయెడి, క్రొత్తనీటిచే
నిండెఁ దటాకగర్భములు, ♦ నిష్కుటముల్ కడుశ్యామలంబులై
మెండుకొనెన్ వనిన్, మొగిలు మేసెఁ బ్రభాతములందు గొండలన్.

శా. నీడల్ గట్టఁగ భూమియందు, చదలన్ ♦ వ్రేలాడుకాదంబినీ
చూడాకృష్ణకలాపగుచ్ఛములపైఁ ♦ జూడ్కుల్ కటాక్షించి, లీ
లాడోలాసుఖలాలసీయరతి సో ♦ లన్ నాగె నృత్యోత్సవ
క్రీడోన్మాదములై మయూరములు సా ♦ రెన్ పింఛముల్విప్పుచున్

గీ. కదలిమూలలనుండి పి ♦ క్కటిల శేచి
బొబ్బరిల్లుచు మబ్బులు ♦ పోవనాగె,
గుబ్బెతలు చిత్తచపలత ♦ గుబ్బటిల్ల
చల్లని మిథఃకలాపముల్ ♦ చనువుకొనుచు.



# ఎవరు ?

I



ఆఱుచున్న కలంకారి-చీర చెఱఁగు
లనగ నాశాముఖంబుల నందగించె
భాద్రపదనీలనీరదపంక్తు లపుడు
వ్రాలుచుండె నభోమణి వాడుకళల.

తామ్రవర్ణప్రవాహంబు దరులుదాటి
వఱదఁబెట్టినయట్లు చూపట్టె సంధ్య
మఱలి చనుచుండెఁ బసువులు మార్గలక్ష్మి
యాటలాడుచు వలచు నొయ్యారినడల.

కృష్ణయొడ్డున నేకాంతకేళిఁగోరి
కూరుచుంటివి యొకచోటఁ, గొండనీడ
లోలయఁగఁ గుమారకోమలములయుపవన
మల్లనల్లనఁ గెరలి యుయ్యాలలూఁగ.

ఎఱుపువిఱుగదయ్యె నేటిసిలు, నొకింత
మునిఁగియుండె తెల్లుపూలపడక,
దరులనలుపు మిగుల దర్శనీయమ్ముగ
నచ్చటచటఁ గానవచ్చుచుండె.

కృష్ణవేణియందెల మ్రోత యింపుపోలి
లాలిత తరంగ భంగి మాలాపసరణి
శ్రవణలాలన మొనరించె, పరిసరమున
వేణువు లనుశ్రుతుల మురిపెములు గొలుప.

నిండికొన్న సంధ్యారామణీయకంబు,
పొంగిపొరలు స్రవంతీతరంగశోభ,
యొండొరుల ముద్దులాడుచు నుల్లసిల్లె
లసదపూర్వప్రణయులగ్నలాలనమున.

ఇంతలోన రక్తిమ కృశించుచుంచిపోయె,
చీకటిజడల్ ముడుల్ విచ్చి చిందులాడెఁ
గాని విశ్రాంతిఁగనలేదు కర్ణమోహ
లలితమైన వీచీవేణుమురళిగీతి.

పొదలయందెందొ కనరాక పూర్ణపక్ష
శమునఁ ద్రోవరులనులాగు సుమముల్లో,
కటిక చీకటిఁగోపలఁ గానరాక
పాడుచుండిరి గంధర్వభామలెవరొ.

హాహా! రనుచు ఘోషిలెడి యేటిఁ బాఱఁజూడ
చూపుదగులవు పాలయిసుకపడకలు
గాని, తెల్లుపూఁబొన్నలుంగాని, మునుఁగ
నట్టి గట్టుల నెలవుచిహ్నములుగాని.

చాకిరేవునఁ గాలెడు శవమొకండు
మినుకులాడు దీపముంబోలఁ జనుచునున్న
నావ యొకటుమాత్రము దోఁచె నాకు ముందు
హృదయ మేదోకలస్ఫూర్తి ముడితమయ్యె.

అపుడు చప్పుడుగాకుండ సనుగులిడుచు
నెవరొ నడయాడు సరిసన్న లేగుదెంచె

తోరణకీ యాలపాలసములయి తోచు నూర్పు
కెమ్మోరలఁబట్టి పలుకఁగానెఁ గన్మొదనము-

స్ఫుటముగాఁ గానరాని యాభోగసురూపు
ఎటుచనుచున్న యనుమానమెత్తెనాకు
లెదభిముఖుఁడుఁగా నూరించె నదియు నన్ను
సంస్కృతంబైన కవి కావ్యశైలి వోలె.

ఎవ్వరీ చిన్నచిసటి నేకతసమునఁ
కోపువాఁ రని యడిగితి ముందు నేను
ఎడతెగని వేణుగానముం దడఁగెఁ గొంత
నామకంతస్వరంబు పిన్నాణముగను.

ప్రకృతిసాక్షిగఁ బ్రాంతి పలుకలేము
తన యుదంత మావంతేని చనవుపెనఁగ
పరిచయము లేనివారల పరుసలేద
వలపు వాడల ననిశ్రమైనఁ దెలుపలేము.

మేలిపూదండ యొకటి నా మెడపయైచెఁ
జుట్టుచెంగావిచీర యంచులుబిగించి
పిరుఁదు లసియాడఁగట్టిన పెలది యోర్తు
భ్రాంతిమానసవీచికల్ అంపిలంగ.

మగువహస్తమ్ములోఁ దనహస్తముంచు
నాభుజస్కంధమందు న నంగఁ దవిల్చి,

